# పీఠిక

---

క॥ శ్రీమీరాజా దైవకృపనే,
నీమానసబోధశతక ♦ మిలఁ బ్రకటింపం
గా మదిఁదలఁచి రచించితిఁ
బ్రేమస్ఫూర్తియుతాపరయ్య ! ♦ పెద్దలుఁ, జిన్నల్. ॥౧॥

సీ॥ నేరవించిన శతకంబు ♦ నీకు మీరాజుఁ ।
బుస్తకంబున లిఖియించఁ ♦ బూనివ్రాసి ।
చిన్నగురువప్పదాసిని ♦ చెలువుమీఱయ ।
నచ్చువేయింపఁ గోరిన ♦ యంతలోన. ॥౨॥

క॥ సి. వెంకటరెడ్డి సుహృ
ద్దేవునికృప నన్నుఁజేరి ♦ దీనిని వేగన్ ।
కవిగ నన్ప్రోత్సహించెద
నీవలయు నటన్నఁబొత్త ♦ మిచ్చితి వేడ్కన్. ॥౩॥

సీ॥ అంతనాస్నేహితు ♦ లగురాజుపేట రా,
మస్వామిరెడ్డియు, ♦ మాన్యుఁడైన ।

మహి ముదరాదొడ్డి ♦ మణియగారగుంట్టి,
వెంకటరెడ్డియు, ♦ వీరకల్లు ।

రామిరెడ్డియు, నదే ♦ గ్రామనివాసియగా,
చిన్నవెంకటరెడ్డి, ♦ సిరులనలర ।

సద్గుణార్ణవుఁడని ♦ సత్కీర్తిఁ బొందిన,
కుజనదూరుండగు ♦ కొత్తపల్లె ।

పెద్దమునేగౌడుఁ, ♦ బెంపున వెలసిన,
చిన్నమునేగౌడు ♦ చెలువుమీఱ ।

శతకము ల్ముద్రించి ♦ సజ్జనులానస,
దాసమొనర్చుట ♦ తగునుగాన ॥

గీ॥ పాఠశాలలకును, మఱి ♦ బాలురకును ।
శతకముల వేయిప్రతులను ♦ సంతసమున ।
దాన మొసరింపవలెనని ♦ పూనిపలికి ।
ద్రవ్యమొసఁగిరి ముద్రింప ♦ ధర్మమతులు॥ ॥౪॥

కం॥ వీరిసహాయంబున ని
ధారణి నీశతక మొకటి ♦ తద్దయు వెలిగెన్ ।
వీరల ధర్మగుణంబును
సారెకువర్ణింపవచ్చు ♦ సజ్జనులగుటన్ । ॥౫॥

కం॥ బాలురు, బెద్దలుశతకము
లాలింబఠియింప శుభము ♦ లొందగూడును నా
శూలికృప మంచిగుణములు
చాలఁబ్రబలు నిహ, పరముల ♦ సౌఖ్యంబమరున్ ॥౬॥

ఇట్లు సుజనవిధేయుడు,

M. నంజుండయ్య,

కిగణము.



# మానసబోధ శతకము.



కం॥ శ్రీమంతుఁడు జగదీశ్వరుఁ
డేమారకఁ గొలువుమతని ♦ నేర్పడు శుభముల్।
ధీమంతుఁడవై తేసి
నీమాటను సత్యమనుచు నెంచుము మనసా! (1)

కం॥ ఇలవిశ్వబ్రాహ్మణకుల
జలనిధి శుభ్రాంశుఁడవు బ ♦ సవమాంబయనన్।
వెలిఁగిన సతి సుతుఁడవునిన్
బిలుతురు సంజన్యాయనుచుఁ ♦ బ్రియమున మనసా!

కం॥ రయమునఁ బుట్టించుటకును
దయచే బాలించుటకు నుఁ ♦ దానేమరలన్।
లయమొందించుటకును నా।
భయరహితుఁడు దేవుఁడౌఁగు ♦ బాగుగ మనసా!

కం॥ మన్నును, నీటిని, నిప్పునుఁ,
బన్నగములకన్నమైన ♦ పవనంబును, నా
మిన్నునుఁ గలిఁగించినయా
మెన్నఁదరముకానివాని ♦ నెన్నుము మనసా! (4)

కం॥ తను, బుద్ధీంద్రియముల నా
త్మను జోడఁగఁ జేసిజీవ ♦ తతుల జగమునం
దనిశము సృష్టియొనర్చెడి
ఘనునిఁదలఁచుచున్నముక్తి ♦ కలుఁగును మనసా!

కం॥ ఇలకును రాత్రినిఁ, బగలునుఁ
గలిఁగించి; జగత్త్రయంబుఁ ♦ గలిఁగించి;గిరుల్
కలిఁగించి; సప్తజలధులఁ
గలిఁగించినవాని నెపుడు ♦ కనుదువో? మనసా! (6)

కం॥ సామజములందు, విహగ
స్తోమంబుల తనువులందు, ♦ దోమలయందున్,
జీమలయందును వెలిగెడు
ధీమంతునిఁ గొలువుమీవు ♦ దినమును మనసా!(7)

౮॥ నిండిన వేడుకతో బ్ర
హ్మాండంబును గలుగఁ జేసి; ♦ యాశ్చర్యముగా
నండజములు, పిండములను
దండిగ సృజియించువాని ♦ దలఁచుము మనసా! (8)

౯॥ కలిగించిన భగవంతునిఁ
దలఁచనివాఁ డెట్టివాఁడు? ♦ తలంచియైనాఁ
ఖలుఁడతఁడు ఖండితంబుగఁ
దలఁచుచు జరియించువాఁడు ♦ ధన్యుఁడు మనసా!

౧౦॥ దేవుని భజియించిన నో
బోవును పాపంబులెల్ల, ♦ బుద్ధియుఁ గలుగున్,
జీవియుఁ జేకూరును, సౌ
ఖ్యావహ మాధవునిపూజ ♦ యారయ మనసా! (10)

౧౧॥ సత్యము సంపదలిచ్చును,
సత్యము పాపములఁ బాపు, ♦ సౌఖ్య మొసంగున్,
సత్యము ఘనతయుఁ గూర్చును
సత్యమునకు సాటిలేదు ♦ జగమున మనసా! (11)

కం॥ సత్యముఁ బలికెడు మనుజుని
సత్యాత్ముండా ప్రభుజనులు, ♦ సభ లందతనిన్।
నిత్యంబు గౌరవింతురు
సత్యాత్ముండు నాకమునకుఁ ♦ జనునో మనసా! (12)

కం॥ పురుషులలో నిజమాడెడు
పురుషుండుత్తముండగాన ♦ భువియందలి స।
త్పురుషులు నిజము నె పలుకుచుఁ
బురుషార్థములందుచుంద్రు ♦ పొలుపుగ మనసా !

కం॥ ఇమ్మహియందలి మనుజులు
నమ్ముదురు నిజంబుఁ బలుకు ♦ నరుని సతతమున్।
సమ్మతమగు సత్యంబును
నమ్మినచో జయముఁ గలుఁగు ♦ నరులకు మనసా!

కం॥ బొంకినఁ బాపముఁ దప్పదు
బొంకిన నాపదలుఁ గలుగు, ♦ బోవు యశంబున్,।
బొంకిన దుఃఖముఁ బొడమును,
బొంకిన గౌరవము, సిరియుఁ ♦ బోవును మనసా!(15)

కం॥ బొంకిన నాయువుఁ దొలఁగును,
బొంకిన భుక్తికిని లేకఁ ♦ బోవును జగతిన్,
బొంకిన ముక్తియుఁ గలుఁగదు,
బొంకిన సుగుణములుఁ దొలఁగి ♦ పోవును మనసా!

కం॥ పెద్దలు బొంకెడు వానిని
దద్దయుఁ దిట్టుదురు వాని ♦ దమ యొద్దకు రా
నద్దని చెప్పుచు నుండెద
రద్దిర! బొంకంత క్రూర ♦ మైనది మనసా ! (17)

కం॥ ఆటాడునప్పుడుగానీ,
మాటాడెడు నప్పుడుగాని ♦ మనుజుం డెప్పుడున్।
బూటకములాడరాదిల
వాటము కాదట్టి మృషల ♦ వదలుము మనసా!(18)

కం॥ నమ్మరు బొంకెడువానిని
నిమ్మహినొక పీసమైన ♦ నీయరు మనుజుల్।
నమ్మకము లేని మనుజుం
డెమ్మెయి జీవింపఁ గలుఁగు ♦ నిమ్మహి మనసా!

కం॥ అనఁదగు నేమనుజుఁడని
యనవరతము బొంకువాని ♦ నారయఁబోవా।
దిన, దొంగతనముఁ గలిఁగిన
శునకంబన వచ్చువాని ♦ సుజనులు మనసా! (20)

కం॥ జ్ఞానము ముక్తికి మూలము,
జ్ఞానము సుగుణములఁ గూర్చు, ♦ సంతసమొసఁగు౯
జ్ఞానము లేని మనుష్యుఁడుఁ
బూనఁడు సత్కార్యములకు ♦ భువిలో మనసా! (21)

కం॥ జ్ఞానముఁగలిఁగినవానిని
**మా**నవులిల గౌరవింత్రు, ♦ మంచిచెడుఁగులా।
జ్ఞానికిఁ దెలియుచు నుండును
జ్ఞానము లేనట్టివాఁడె ♦ జడుఁడిల మనసా! (22)

కం॥ నరులకు ముఖ్యములైనవి
పురుషార్థములందు మొదట ♦ బొల్చును ధర్మం।
బరయఁగ ధర్మము లేనిదె
సిరికలుఁగదు **మా**నవులకు ♦ సిద్ధము మనసా! (23)

కం॥ ఇల ధనహీనునకును మదిఁ
దలఁచిన కార్యములు గావు ♦ ధర్మాత్మునకుం
గలుఁగును ధన, మద్ధనమునఁ
గలుఁగును సౌఖ్యంబులీజ ♦ గంబున మనసా! (24)

కం॥ హితుఁడారయ ధర్మ మిల
మతిమంతుఁడు వదలకుండు ♦ మహిధర్మంబున్.
మతిహీనుఁడు వదలును వాఁ
డతికష్టములందుచుండు ♦ నరయుము మనసా! (25)

కం॥ వెనువెంటవచ్చు ధర్మము
జనిన యెడకు మిత్రు,లాత్మ ♦ సతి, సోదరులున్।
జననీ, జనకులు వెంబడిఁ
జనఁగల రేతనువు వదలి ♦ చనుతర మనసా! (26)

కం॥ మనుజుఁడు సంపాదించిన
ధన, ధాన్య, క్షేత్రములునుఁ ♦ దనువువదలి తా।
జనువేళ వెంటఁబోవవు
చనుధర్మము వానితోడ ♦ సత్యము మనసా! (27)

కం॥ స్థిరమని తలఁచెదు భూమియుఁ
బరికింపఁగ నస్థిరంబె ♦ పండితుఁడగువాఁ
డరసిగడించిన ధర్మము
పరువిడినను వెంబడించి ♦ వచ్చును మనసా! (28)

కం॥ తనుఁబెంచువాని ధర్మం
బనుమానము లేక బెంచు ♦ సత్యమూర్తుండై
తనుఁజెఱచువాని ధర్మం
బనుమానము లేకఁజెఱచు ♦ నంచును మనసా! (29)

కం॥ ధర్మాత్ముని జూచిన దు
ష్కర్ములు భయమందుచుంద్రు ♦ ఘనుల చెలిమియా
ధర్మాత్మునికిం గలుఁగును
నిర్మలకీర్తియునుఁ గలుఁగు ♦ నిక్కము మనసా!(30)

ధర్మమున నిహ సుఖంబును,
నిర్మలమగు పరసుఖంబు ♦ నీటుగఁ గలుగున్
మర్మం బెఱుఁగక ధర్మము
మార్గముఁ వదలి పొందు ♦ దుఃఖము మనసా !(31)

కం॥ మృతిలేనివాని విధమున
సతతంబు ధనార్జనంబుఁ ♦ జలుపంగవలెన్।
మృతినేఁడో? యెల్లియో? యను
గతి ధర్మంబాచరింపఁ ♦ గావలె మనసా! (32)

కం॥ ధనమును వయసునుఁ గూరిచి
తనకు ముదిమి కలిఁగినపుడు ♦ దానము సలుపన్।
దనమదిఁ దలఁచుట వెఱ్ఱియు
తననిల్కడఁ దానెఱుంగఁ ♦ దరమే మనసా! (33)

కం॥ తనకుంగల మాత్రములో
ననుదినమును దానమిచ్చు ♦ నది మంచిది యి
య్యనువెఱిఁగి మానవుండిలఁ
జనుదానము సల్పుచుంట ♦ సత్యము మనసా! (34)

కం॥ ప్రతిఫలము మదినిఁగోరక
నతులితముగ దానమిచ్చు ♦ నది శుభదంబౌ।
క్షితిడంబము మనుజుఁడుఁదన
మతిగోరియొసంగఫలము ♦ మ్రగ్గును మనసా! (35)

కం॥ దానంబంధులకును, బని
బూనిసలుప శక్తిలేని ♦ పురుషులకును, బల్।
దీనులగు మూగవారికిఁ
బూనికతో నీయవలయుఁ ♦ బురుషులు మనసా!(36)

కం॥ పురుషులిలఁ గుంటివారికి,
నరయంగా బీదజనుల, ♦ కతివృద్ధులకున్,।
సరసతరోగికిఁ, జెవిటికి
వరుసఁగ దానంబుఁజేయ ♦ వలయును మనసా!(37)

కం॥ క్షామమునం దన్నంబును,
సామాన్యదినంబులందు ♦ సదయత ధనమున్।
వేమారు నొసఁగు ధన్యుల
కీమహి సామాన్యమనుజు ♦ లీడే? మనసా! (38)

కం॥ దానముల నన్నదానముఁ
బూనికతోఁజేయునట్టి ♦ పుణ్యాత్మునకున్।
దీనాధారుఁడు దేవుఁడు
మానకశుభముల నొసంగు ♦ మఱి, మఱి మనసా!

కం॥ తినుకాలంబున బీదలుఁ
దనయింటికి వచ్చిరేని ♦ దయఁగలవాఁడై।
తనకున్నమాత్ర మన్నముఁ
గొనుఁడని యిచ్చిన శుభంబుఁ ♦ గూడును మనసా

కం॥ వచ్చినబీదల కొసఁగకఁ
గుచ్చితుఁడు తిరస్కరించి ♦ కొట్టఁగఁబోవున్।
మచ్చికతో స్వల్పంబుగ
నిచ్చిన సంపద నశించు ♦ నేమో? మనసా! (41)

కం॥ అన్నమొ? కూరయొ? నీరో?
యున్నది యేదైననీయ ♦ కుంచుట తగునే?
తిన్నఁగరమ్మని యర్థుల
కన్నమిడెడువాఁడె దేవుఁ ♦ డారయ మనసా! (42)

కం॥ మారుతహతిచేదీపం।
బేరీతిగ నాఱునట్టు ♦ లేగునుసిరి సం।
సారులకదినిత్యం బే?
కూరిమితో దానమీయఁ ♦ గూడదె మనసా! (43)

కం॥ దానంబియ్యక, బిసునతఁ
దానుఁదినక దాఁచినట్టి ♦ ధనమునకుఁదుదన్ ।
మానక నాశమె గతియగుఁ
గానఁదినుచు, దానమీయుఁ ♦ గాఁదగు మనసా!(44)

కం॥ పెట్టుడి వాఁడెట కేగిన
నెట్టనసమ కూడుచుండు ♦ నిఖిలార్థంబుల్ ।
పెట్టనివాఁ డియ్యవనిన్
బట్టఁపురాజైనఁగీర్తి ♦ బడయునె? మనసా ! (45)

కం॥ ధనమును దేవునిపనులకు,
వనములు, సత్రములు, మంచి ♦ బావులు, బాటల్।
ఘనముఁగ నిర్మించుటకును
వినియోగ మొనర్పవలయు ♦ వినుమిది మనసా! (46)

కం॥ కాపురుషుఁడు ధనమునుదు
ర్వ్యాపారంబులకుఁ బెట్టి ♦ వ్యర్థ మొనర్చున్ ।
దాపగుధర్మముఁ జలుపఁగ
నోపడువాఁడుండు వరకు ♦ నుర్విని మనసా! (47)

కం॥ నంజుటికిని గల్లునకున్
గంజాయికి, దాఁడుగలకుఁ, ♦ గపటాత్మకులా ।
లంజలకు ధనము బెట్టిన
గంజికి లేకుండఁ బోవుఁ ♦ గాదే ? మనసా ! (48)

కం॥ సువివేకులుఁ దమధనమును
కష్టులకు, బీదలకు, దైవ ♦ కార్యంబులకున్ ।
భువిజనులా నసఁబెట్టుచు
నవిరళమగు కీర్తిఁబొంది ♦ చులరరె? మనసా! (49)

కం॥ వేయేల ? ధర్మకార్యము
లేయనఘుఁడు సలుపఁగలఁడో ? యిలసుగుణుండై ।
యాయనుప మానునికిబల్
శ్రేయంబులుఁ గూడుచుండు ♦ సిద్ధము మనసా! (50)

కం॥ హితుఁడారయ దయ దయచే
క్షితిజనులకు సుఖముఁగలుఁగుఁ ♦ జిత్రముగదయున్ ।
హితుఁడగు శత్రుఁడు దయ శా
శ్వితముగమానవులునిలుపఁ ♦ జెల్లును మనసా!

కం॥ దీనులపై, భృత్యులపై,
మానక నిరుపేదలైన ♦ మనుజులపై సు।
జ్ఞానులుదయ నిడియుందరు
మానరు సద్గుణమువారు ♦ మాన్యులు మనసా!

కం॥ చీమలపై, దోమలపై,
భూమిం దిరు గాడుచట్టి ♦ పురుఁగుల పైఁదా।
నేమార్పు లేకదయనిడి
ధీమంతుఁడు శుభముఁబొంది ♦ తీరును మనసా! (53)

కం॥ దయలేని వానిఁజూచిన
భయపడుదురు వాడుశుభముఁ ♦ బడయఁడు భువిని।
ర్దయుఁడని తిట్టుదురతనిని
దయఁగలవానిని నుతింపఁ ♦ దగునో మనసా! (54)

కం॥ దాంతులకైనను, భువివే
దాంతులకైనను మనోంబు ♦ జాంతర మందుఁ।
జింతింప సుఖముఁ గలుఁగదు
శాంతము లేకున్ననిది ని ♦ జంబో! మనసా! (55)

కం॥ శాంతముఁ గలవానినిస
శ్రాంతము వర్ణింత్రుజనులు ♦ సంతోషముతో ।
శాంతరహితు దూషింతురు
శాంతము సుఖముల నొసంగు ♦ సతతము మనసా

కం॥ శాంతమున వదలుఁగోపము,
శాంతముచేఁ గుదురుబుద్ధి, ♦ శాంతమువలనన్ ।
సంతోషం బొనఁగూడును
శాంతాత్ముని గౌరవింపఁ ♦ జనునో మనసా! (57)

కం॥ శాంతంబు భార్యవంటిది
శాంతంబిల భార్యఁబోలి ♦ సతతముఁగాచున్ ।
శాంతము వదలినవానికి
వంతఁగలుఁగు వాఁడుపుణ్య ♦ వంతుఁడె? మనసా!

కం॥ క్షమసత్పుత్త్రుని వంటిది
సుమతుల్ క్షమఁ గలిగియుండ్రు ♦ శుభములొసంగున్ ।
క్షమ, గౌరవ మొనఁగూర్చున్
క్షమవదలిన మేలులేదు ♦ జనులకు మనసా! (59)

కం॥ ఓర్పున దుఃఖంబునుఁబరి
మార్పనగును దానివలన ♦ మనుజుండరులన్ ।
మార్పఁగలఁడు మిత్రులుఁగా
నేర్పరులా యోర్పువదల ♦ నేరరు మనసా! (60)

కం॥ కామంబు పనికిరానిది
కామించిన నేమి ఫలము? ♦ కామ్యార్థంబుల్ ।
ధీమంతుఁడనఘుఁ డీశ్వరుఁ
డేమాత్రం బీయకున్న ♦ నేమగు? మనసా! (61)

కం॥ కోరికనుఁ దీర్చుకొనఁ బని
నారంభించినఁ, బ్రయాస ♦ మంది సలిపినన్ ।
గూరిమి చేదేవుఁడు ఫల
కారిగఁ గాకున్న నేమి ♦ కలదో? మనసా! (62)

కం॥ కోరికకుఁ దుదయుఁ గలదే?
కోరికలు ఫలించెనేని ♦ గోరఁడె మరలన్?
గోరుచునె యుండు మనుజుఁడుఁ
గోరికఁ బెంచిననుబుద్ధి ♦ కుదురునె మనసా! (63)

కం॥ అరయఁగ రొక్కము, ధాన్యము, [కరుల్,
వరమణులును, భూషణములు,♦వస్త్రములు,
తురగములుఁ దనకుఁ గలిఁగినఁ
బురుషుండివి చాలుననఁడు ♦ పుడమిని మనసా! (64)

కం॥ చింతింపకఁ బ్రాపించిన
దెంతైననుఁ దృప్తిఁజెందు ♦ క్షేమంచిదితా।
నెంతోఁగోరిన వచ్చునె?
చింతించినవంత పుట్టు ♦ సిద్ధము మనసా! (65)

కం॥ కోపమునఁగూడుచుండును
పాపము, కోపమునమిగుల ♦ భయమొనఁగూడున్,
గోపమునఁ జెడును బుద్ధియుఁ
గోపము నిక్కముగ వెఱ్ఱి ♦ కుక్కయె మనసా! (66)

కం॥ కోపము వదలుట మంచిది
కోపము లేనట్టివాఁడు ♦ కోవిదుఁడరయన్।
గోపిని సుజనులు మెచ్చరు
కోపంబెవారికైనఁ ♦ గూడదు మనసా! (67)

కం॥ కోపము క్షణముత్తమునకుఁ
బాపిష్టికిఁ జచ్చువరకుఁ ♦ బాయదు వాఁడా।
కోపంబున కృశియించును
కోపము లేకున్నఁదీరుఁ ♦ గోరిక మనసా! (68)

కం॥ లోభినిఁ దిట్టుదురర్థులు
లోభి తినఁడు మంచి తిండి ♦ లోకంబుననా।
లోభికి సౌఖ్యముఁ దక్కువ
లోభంబును వదలవలయు ♦ లోకులు మనసా!

కం॥ పిసినికి నరకముఁ దప్పదు
పసిబాలుం డైనవానిఁ ♦ బాటింపఁడిలన్।
రసికులు వానిం జేరరు
హసియింతురు వాని సుజను ♦ లందరు మనసా!(70)

కం॥ మోహమునఁ జెడు వివేకము,
మోహంబున హానికలుఁగు, ♦ ముక్తియుఁ దొలఁగున్,
మోహమున లేమి వచ్చున
ఊహముఁగాదిది వచింత్రు ♦ బుధులిల మనసా! (71)

కం॥ మానస్ఫుఁడిల మోహంబున్
దీనుండగు దానివదలి ♦ ధీరుండునదా।
యానంద మొందుచుండును
దానిని వేగిరము నీవుఁ ♦ దహింపుము మనసా! (72)

కం॥ మదమున సుగుణములెల్లను
వదలును; తెలివియును, ఘనత ♦ వదలునుదానిన్ ।
వదలినవాఁడిల ధన్యుఁడు
వదలనివాఁ డరయఁజెడ్డ ♦ వాఁడే మనసా : (73)

కం॥ గర్వమునఁ జేటుఁగలుఁగును,
గర్వముఁ గలవానిబుధులు ♦ గర్హింతురెలన్ ।
గర్వము నుడిఁగినవానిని
గర్వియనుచు గౌరవింత్రు ♦ ఘనులిల మనసా! (74)

కం॥ మత్సరమునుఁ బెంచుకొరిలఁ
గుత్సితులగు వారుదానిఁ ♦ గూడునె పెంపున్ ?
సత్సహవాసము గొనియా
మత్సరమును మాన్పఁదగును ♦ మనుజులు మనసా!

కం॥ ఈసున సమకూడునుబల్
త్రాసము, దోసంబుఁ, జేటు ♦ దానివదలి సం ।
తోసమున నుండఁదగునగుఁ
డీసాగతి మఱనఁబోకు ♦ మికనో మనసా ! (76)

కం॥ నడవడి మంచిదియైనను
బుడమిని సౌఖ్యంబుఁగలుఁగుఁ ♦ బూజ్యతకలుఁగున్ ।
నడవడి చెడ్డదియైనను
జెడుటనిజము: మంగళములుఁ ♦ జేరవు మనసా! (77)

కం॥ ఇలమంచి వాడనంగా
మెలఁగుట కష్టంబునీకు ♦ మిగులఁ జెడుఁగనన్ ।
మెలఁగుట మిక్కిలి సులభము
ఖలునకుఁ గష్టములుఁజాలఁ ♦ గలుఁగును మనసా !

కం॥ కీడొనఁగూడిన సుజనుఁడు
వీడఁడు ధైర్యంబు, మొదటి ♦ వృత్తియు నగ్నిన్ ।
బోడిమిఁ జెడఁగాఁద్రిప్పిన
వీడునెతన పూర్వగుణము? ♦ వీడకు మనసా! (79)

కం॥ ఓర్వకఁ గుజనుఁడుఁదిట్టిన
గర్వరహితుఁ డాత్మలో వి ♦ కారంబిడునే?
యుర్విని నగ్నికణంబున
నౌర్వమునకుఁ దాళుజలధి ♦ యడఁగునె? మనసా !

కం॥ లేమిఁగృశించిన ఘనునిన్
భూమింగల హీననరుఁడుఁ ♦ బోలునె? గ్రాసం।
బేమియుఁ జిక్కకఁ గుందిన
సామజవైరికినిఁగుక్క ♦ సాటియె? మనసా! (81)

కం॥ మిత్రుండౌషధ మారయ
మిత్రుఁడు శాత్రవులఁగూల్చు; ♦ మేలొసఁగూర్చున్ ;।
మిత్రుఁడు దుఃఖము బాపును
మిత్రులఁగడి యింపవలయు ♦ మేదిని మనసా!(82)

కం॥ హితులు వచించెడు బుద్ధులఁ
బహితుండై విననివాఁడు ♦ బలుకష్టపడున్; ।
హితులు వచించెడు బుద్ధుల
సతతము వినువాఁడుఁబొందు ♦ సౌఖ్యము మనసా !

కం॥ సుజనులఁ జేరినపురుషుఁడు
సుజనుండగు, సిరులవడయు, ♦ సుఖముఁ గడించున్ ।
కుజనులఁ జేరినపురుషుఁడుఁ
గుజనుండగుఁ గాన జేరఁ ♦ గూడదు మనసా! (84)

కం॥ మంచిగుణంబులు నరునకుఁ
గొంచంబుగ నున్నఁ జాలుఁ ♦ గుంభినియందున్ ।
మించిన తేజముఁ గలమణిఁ
గొంచంబుగనున్న దానిఁ ♦ గొనరే ? మనసా! (85)

కం॥ ఇలలో సంతోషంబుగ
మెలఁగుట నాకంబుసంను ♦ మెలగుట యొకటే ।
యిలదుఃఖంబున నుండుట
దలఁపనిరయ వాససమము ♦ తథ్యము మనసా!(86)

కం॥ పరులకుఁ గష్టముఁ బెట్టుట
సరికాదిల మానవుండు ♦ సజ్జనుడైతే ।
పరుల కుపకారమే పలు
మరు సలుపుచు నుండవలయు ♦ బాగుగ మనసా!(87)

కం॥ తనకొక కష్టముకలిగినఁ
దనమదియు నెట్లుతానె ♦ తలచునో? యట్లే !
తనవలనఁ గష్టపడియెడు
జనుఁడుం దలఁచునంచు దెలియఁ ♦ జనునిల మనసా !

కం॥ పరునిధన మపహరించుట
పరునిధనముఁగోరి వాని ♦ బాధించుటయు౯
సరియని మదిఁదలఁచడు గా
పురుషుండిహ, పరసుఖములఁ ♦ బొందునె? మనసా!

కం॥ హింసయె మెచ్చెడు వానికి
హింసకలుగు లోకులతని ♦ హీనుఁడనరె? యౌరా !
కంసుఁడు హింసయెసర్వఁగ
హింసింపఁడె వానిఁగృష్ణుఁ ♦ డిలలో మనసా! (90)

కం॥ తల్లికిఁ, దండ్రికి, గురువున
కుల్లాసముఁ గలుగఁజేయు ♦ చుండఁదగునువా
రుల్లమున నుల్లసిల్లినఁ
జల్లఁగజీవింపఁ గలుగుఁ ♦ జగమున మనసా! (91)

కం॥ జనకునిఁగామాంసమున।
జనపతినిఁ దలంచి; యతని ♦ సంరక్షింపన్।
మానసమున దేవుని వేఁడుచు;
జనపతినిం గౌరవింపఁ ♦ జనునో మనసా! (92)

కం॥ వారిధిఁ గట్టఁగవచ్చును,।
గౌరుమదముదింపవచ్చు, ♦ గరళంబెక్కన్।
ధీరతదింపఁగవచ్చును
ధారిణిమూర్ఖునికిఁ దెలుపఁ ♦ దరమే? మనసా! (93)

కం॥ తనమగఁడే దేవుఁడని।
తనమది భావించి యతనిఁ ♦ దద్దయుభక్తిన్।
దినమునుఁ బూజించెడియా।
వనితకుఁ జేయెత్తి మ్రొక్క ♦ వచ్చును మనసా!

కం॥ పురుషునిఁ దిరస్కరింపుచు।
పరపురుషులఁ గూడఁ దలఁచు♦ భామను మనుజుల్
నిరతంబుఁ దిట్టుచుందురు।
నిరయంబున కేఁగునట్టి ♦ నెలఁతుక మనసా! (95)

కం॥ జూదంబాడుటవలనన్।
ఖేదంబుఁ జనించుచుండుఁ, ♦ గీర్తితొలంగున్,।
వాదంబుఁ బుట్టు, ధనమును।
జూదంబునఁ బోవునరసి ♦ చూడుము మనసా! (96)

కం॥ వాయువుచే మేఘంబులుఁ।
బాయుచుఁ, గూడుచుఁ జరించు ♦ భంగి నరులకున్
బాయఁగ, గూడఁగఁ గాలము।
చేయునుకాలంబు మిగులఁ ♦ జిత్రము మనసా! (97)

కం॥ సిరికలిఁగిన సంతసపడి।
సిరిపోయిన దుఃఖపడఁగఁ ♦ జెల్లునె మనుజుల్?
ధరలోఁ గలుఁగుట, తొలఁగుట।
పరమేశునివలనఁగాదె ♦ పరిపరి? మనసా! (98)

కం॥ నీవలన బాధ, మోక్షము।
లీవసుధఘటిల్లునందు ♦ రెఱిఁగిన వారల్।
నీవా దేవునిఁ బలుమరు।
సేవింపుము మేలుఁగలుఁగు ♦ సిద్ధము మనసా! (99)

కం॥ దినమునకుఁ గొన్ని సారులు।
పనులున్నను ముఖ్యమైన ♦ పనియని నీలో ।
ఘనుఁడగు దేవుని వేఁడుము ।
తనువిది శాశ్వతముకాదు ♦ తథ్యము మనసా! (100)

కం॥ పరిపరిమార్గంబులలోఁ ।
బరుగునఁ జరియింతువీవు ♦ బరికింపుము, స ।
త్సరణినిఁ జరియింపఁగదగు।
వెరవును నేర్పింపనీశు ♦ వేఁడుము మనసా! (101)

కం॥ ఆలోచింపుము నిజముగ।
నీలోకసుఖంబు నిత్య ♦ మే? సర్వంబుఁ ।
బాలించువాని మఱచిన।
నేలాఁగు తరింపవచ్చు ♦ నెఱుఁగుము మనసా! (102)

కం॥ పరపురుషునిఁ గోరినసతి।
ధరమఱచు నె పనులుఁగలుఁగు♦తరిఁదన ప్రియునిఁ?
వెరవదియే నీకునుస।
త్పురుషుని దేవుని భజింపఁ ♦ బూనుము మనసా!

కం॥ తనుమదిఁ దలఁచుచునుండెడు।
జనులకుఁ బరమాత్ముఁడేల ♦ సదయుండగుచున్।
గొనుఁడని శుభముల నొసఁగఁడు?
ఘనుఁడాతఁడు భక్తజనులఁ ♦ గాఁచును మనసా!

కం॥ తలఁచిన మాత్రంబునకే।
పలుశుభముల నొసఁగునట్టి ♦ వానిని భక్తిన్।
గొలిచిన వారికిఁ బాపము।
నిలుచునె పరుఁగిడక? సిరులు ♦ నెగఁడవె? మనసా

కం॥ సారసపత్రము పైగల।
నీరెటులంటకయె నిల్చు ♦ నిర్మలముగ? నీ।
వారీతి నెఱఁగి జగమునఁ।
జేరియుఁ, జేరకనె శివునిఁ ♦ జేరుము మనసా! (106)

కం॥ మంగళమీశ్వరునకు, శుభ।
మంగళమాపార్వతికిని, ♦ మారసుతునకున్,
మంగళము సిరికి, ధాతకు,।
మంగళమా భారతికిని ♦ మఱిమఱి మనసా! (107)

కం॥ మంగళము విఘ్నరాజుకు,
మంగళమింద్రునికి, శచికి, ♦ మార్తాండునకున్,
మంగళము సౌజ్ఞకును, జయ
మంగళమిక దేశికునకు ♦ మఱిమఱి మనసా! (108)

మా న స బో ధ శ త క ము

సంపూర్ణము.



